


# చతుర్వేద
# సరస్వతీ సూక్తము

(బుద్ధి వర్ధక వైదిక ప్రార్థన)



మంత్ర కర్త :

సర్వవ్యాపక సర్వేశ్వరి - సరస్వతి

సరళార్థ కర్త :

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ




చతుర్వేద

# సరస్వతీ సూక్తము

(బుద్ధి వర్ధక వైదిక ప్రార్థన)




మంత్రకర్త :

సర్వవ్యాపక సర్వేశ్వరి - సరస్వతి

సరళార్థ కర్త :

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 52

# చతుర్వేద సరస్వతీ సూక్తము

ప్రథమ ముద్రణ ప్రతులు : 1000
ద్వితీయ ముద్రణ ప్రతులు : 1000



సృష్టి సంవత్సరము : 196,08,53,115 (మన్వంతర సంధి రహితము)
197,29,49,115 (మన్వంతర సంధి సహితము)

విక్రమాబ్దము : 2071
దయానందాబ్దము : 191
శ్రీ జయనామ సంవత్సర శ్రావణ శుక్ల పౌర్ణమి
10-08-2014 .

మూల్యము : రూ. **10-00**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1) డా॥ కోదూరి సుబ్బారావు, వైదిక వానప్రస్థాశ్రమం,
హనుమాపురం P.O. భువనగిరి - 508 116 (తెలంగాణ)
సెల్ : 9908994084, 9290604641.
2) గాయత్రీ ఆశ్రమ ట్రస్టు - ఆర్య సమాజము మేడిబావి,
12-10-586/6, ఇందిరానగర్, రోడ్ నెం. 2, వారాసిగూడ,
సికింద్రాబాద్ - 500 061. (తెలంగాణ) సెల్ : 9848011073.
3) మాశెట్టి శ్రీనివాస్ ఆర్య,
షాప్ నెం. 5, 3-3-736 నుండి 740,
కంచరిబజార్, సికింద్రాబాద్ - 500 003. (తెలంగాణ)
ఫోన్ : 040-6632 0300
4) ఆర్యసమాజము-సీతాఫలమండి, సికింద్రాబాద్-500 061. (తెలంగాణ)
ఫోన్ : 27071816, 69990967, 9246174018.
5) ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా)
గుంటూరు జిల్లా. (ఆంధ్రప్రదేశ్). ఫోన్ : 08644-252789

ప్రింటింగ్ : ప్రింట్‌షాప్, సికింద్రాబాద్. ఫోన్ : 040-66320300



## చతుర్వేద

# సరస్వతీ సూక్తము

చదువుల తల్లి సరస్వతీదేవి అవసరం మానవమాత్రులందరికీ ఉంటుంది. కూలిపని చేసుకుని బ్రతికేవాడికైనా కొద్దోగొప్పో చదువు రావాలి. లేకుంటే అతనికి చాల ఇబ్బంది లేర్పడతాయి. కనుకనే '**విద్య లేనివాడు వింత పశు**'వన్నారు పెద్దలు. స్త్రీలు, పురుషులు కనీసం ప్రాథమిక విద్యవరకు అనివార్యంగా చదువుకోవాలి. బాల కార్మికత (Child Labour) ఏ దేశానికీ మంచిదికాదు.

లోకంలో మనకు కనబడే సత్యమైన సమస్త విద్యలకు మూలం పరమేశ్వరీయమైన వేదం. ఆదిమానవ సృష్టి సమయంలోనే సృష్టికర్తయైన పరమేశ్వరుడు యోగ్యులైన నలుగురు ఋషుల హృదయాలలో (బుద్ధులలో) నాలుగు వేదాలను ప్రకాశపరచాడు. అగ్ని నామక ఋషికి ఋగ్వేదం, వాయు నామక ఋషికి యజుర్వేదం, ఆదిత్య ఋషికి సామవేదం, అంగిర ఋషికి అథర్వవేదం లభించాయి. వారు వాటిని తోటి మానవులందరికి–వారి వారి అభిరుచులను సామర్థ్యాలను తెలుసుకొని ఆ యా విద్యలను ఆ నలుగురు ఋషులు బోధించారు.

బ్రహ్మ అనే పేరు గల ఒక గొప్ప ధారణాశక్తిగల ఋషి ఆ నలుగురు ఆదిఋషులనుండి నాలుగు వేదాలను అభ్యసించి "చతుర్వేద వేత్త" అయ్యాడు. ఇతనినే చతుర్ముఖ బ్రహ్మగా పురాణాలు వర్ణిస్తున్నాయి. కాని, అతనికి 4 ముఖాలు, 4 చేతులు లేవు. అతడును మనవంటి శరీరం కలవాడే. సరస్వతీదేవిని అతనికి భార్యగా పురాణాలు వర్ణిస్తాయి. ఆ దేవి బ్రహ్మ నాలుకపై నర్తిస్తుందని కూడ చెబుతారు. అంటే, వారు విద్యలను ఒక స్త్రీమూర్తిగా కల్పన చేసి ఆమెకు 'సరస్వతి' యని పేరు పెట్టి, ఆమె అతని నాలుకపై నర్తిస్తుందని చెప్పినట్లు గ్రహించాలి.

వికాసవాదులు చెప్పుచున్నట్లు ఆదిమానవులు జంతువుల అరుపులను అనుకరిస్తూ, క్రమంగా మాటలను నేర్చుకున్నారనే అభిప్రాయాలు సత్యంకావు. అలా జరిగి ఉంటే ఇంతటి సుసంస్కృత భాష ఏర్పడి ఉండేది కాదు. ఆదిమానవ సృష్టి సమయంలోనే వేదాలతోబాటు వాటి అర్థజ్ఞానం, భాష, లిపి కూడా పరమేశ్వరుని

నుండే మానవులకు లభించాయని మన వేద శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ ఆదిభాష చాల శుద్ధమైనదనీ, పొరబాట్లు లేనిదనీ వేదం చెబుతుంది.

**ఓం బృహస్పతే ప్రథమం వాచో అగ్రం యత్ ప్రైరత నామధేయం దధానాః ।**
**యదేషాం శ్రేష్ఠం యదరిప్రమాసీత్ ప్రేణా తదేషాం నిహితం గుహావిః ॥**

(ఋగ్వేదం, 10-71-1)

ఓ బృహస్పతీ ! వేదవాణికి పతివైన పరమేశ్వరా! నీ ప్రేరణతో ఆది ఋషులు పలికిన పలుకులు, సృష్టిలోని పదార్థాలకు వారు చేసిన నామకరణాలు చాల శుద్ధమైనవి. చాల శ్రేష్ఠమైనవి. వాటిలో పొరపాట్లుకాని, ఉచ్చారణ లోపాలుకాని ఏమీ లేవు. అవి పూర్వ సృష్టిలో ఆ ఋషులు పలికినవే! అవి వారి హృదయాలలో నిహితమై యున్నవే ! నీ ప్రేరణతో వాటినే వారు మరల పలికారు. ఆ శుద్ధమైన ఉచ్చారణనే తోటిమానవులు అనుకరించారు - అనుసరించారు.

ఆదిమ మానవ రచితమైన గ్రంథము - మనుస్మృతియును ఇట్లే చెబుతుంది.

**శ్లో॥ సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్ ।**
**వేద శబ్దేభ్య ఏవాఽఽదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే ॥**

(మనుస్మృతి, 1-21)

సృష్ట్యాదిలో పదార్థములకును, కర్మలకును వేరువేరుగా ఆది ఋషులే వేదపదములతో నామకరణం చేశారు. అందుచే ఆ వాచ్యవాచక సంబంధం శుద్ధమైనది.

సృష్ట్యాదిలో సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు ఋషుల వాక్కును (స్వరపేటికను) ప్రేరేపించి పదార్థముల పేర్లను పలికించాడు. ఆ విశుద్ధమైన వాణినే (మాటలనే) తోటి మానవులంతా అనుసరించారు. ఆ విధంగా భాషోత్పత్తి జరిగింది. లిపియును అట్లే ఉద్భవించింది. ఆ ఆదిఋషుల సంతానం - శిష్యగణం ప్రపంచమంతా పర్యటించి మానవులకు మాటలను నేర్పారు. లిపిని బోధించారు. వారిని జ్ఞానవంతులను చేశారు. కాలక్రమంలో ఆ ఆదిమభాష-వేదభాష-సంస్కృతభాష కొన్ని మార్పులకు గురియై వివిధ ప్రాంతీయభాష లేర్పడ్డాయి. భాష పుట్టుకపై పరిశోధన చేసిన వారంతా ఆ యా భాషలకు మూలం 'సంస్కృత భాషయే' నంటున్నారు. ఆ అర్థవంతమైన భాషనే అనగా జ్ఞానాన్నే వేదం "సరస్వతి"

అంటుంది. సరస్వతి పదం స్త్రీ లింగంలో ఉండటంవల్ల పౌరాణికులు ఆ పేరుతో ఒక స్త్రీదేవతామూర్తిని కల్పించారు. కాని, సరస్వతి స్త్రీ కాదు. అనంత జ్ఞానం కల సర్వవ్యాపక సర్వేశ్వరుడు.

## సరస్వతి అంటే ....

ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలలో "సరస్వతి" పదం పెక్కుచోట్ల కనబడుతుంది. వైదిక వ్యాకరణాన్ననుసరించి సరస్వతి పదం 'సృ-గతౌ' అనే ధాతువుతో ఏర్పడుతుంది. 'సృ' నుండి ముందుగా సృ+కసున్-తో 'సరస్' ఏర్పడి దానితో 'మతుప్' మరియు 'జీప్' ప్రత్యయముల కలయికచే సరస్వతీ పదం నిర్మితమౌతుందని వ్యాకరణ విద్వాంసులంటారు. (గతౌ స్త్రయోఽర్థాః జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి) గతికి మూడర్థాలున్నాయని అంటారు. అవి (1) జ్ఞానం (2) గమనం (3) ప్రాప్తి. 'జ్ఞానపూర్వకమైన గమనంతో ప్రాప్తించతగినదానిని ప్రాప్తింప చేసేది గతి' యని వివరిస్తారు. ఈ మూలార్థాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ యా ప్రకరణాలను (ప్రసంగాలను contexts ను) బట్టి 'సరస్వతి' పదమును తగిన విధంగా అర్థం చేసుకోవాలి.

వేదాలు అనేకార్థ బోధకాలు. వాటికి ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవికము లనే మూడు రకాల అర్థాలను చెప్పవచ్చునంటారు విద్వాంసులు. ఆధి యాజ్ఞికార్థం కూడా మరొకటి ఉంటుందని కొందరంటారు. ఆ మార్గంలో మనం ఆలోచిస్తే .....

ఆధ్యాత్మికార్థంలో సరస్వతి అంటే పరమేశ్వరుడే. అనంత జ్ఞాన స్వరూపుడు, సర్వవ్యాపకుడునైన ఏకేశ్వరుడే సరస్వతి. ఎందుకంటే - పరమేశ్వరునికున్నంత యథావిధ శబ్దార్థజ్ఞానం మరెవ్వరికి ఉండదు కనుక. ఈ పదమునకు పరమేశ్వరుని పరంగా నిర్వచనం చెబుతూ **"సరో వివిధం జ్ఞానం విద్యతే యస్యాం చితౌ సా సరస్వతీ"** అతనికి వివిధములైన జ్ఞానం - అనగా శబ్దార్థ సంబంధ ప్రయోగాల జ్ఞానం యథాతథంగా ఉంటుంది కనుక పరమేశ్వరుని "సరస్వతి" యని అన్నారు. **(తత్ర నిరతిశయం సర్వజ్ఞ బీజం** - యోగదర్శనం 1-25)

'సరస్వతి' స్త్రీలింగ పదం అయితే, పరమేశ్వరుడు స్త్రీయా ? అని సందేహించ నక్కరలేదు. అతడు స్త్రీ కాదు, పురుషుడు కాదు, నపుంసకుడును కాదు. అతడొక విశ్వవ్యాపకమైన చేతన తత్త్వం. అనంతమైన జ్ఞానం, అనంత శక్తి సామర్థ్యాలుగల మహత్తర శక్తి. అయినా అతనికి స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగాలకు చెందిన

పేర్లు చాలానే ఉన్నాయి. ఉదా॥ బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, సరస్వతి, లక్ష్మి, శక్తి, జలము, వాయువు, అగ్ని మొదలైనవన్నీ ఒకే పరమేశ్వరుని పేర్లు.

**'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి'** అంటుంది ఋగ్వేదం (1-164-49)

అధి భౌతికార్థంలో - అంటే ప్రాణులలో ముఖ్యంగా మానవులలో విదుషీ స్త్రీ సరస్వతి ఔతుంది. కన్యా గురుకులంలో సాంగోపాంగ వేదాధ్యయనం చేసిన స్త్రీయే సరస్వతి ఔతుంది కాని సామాన్య విద్యలు నేర్చిన స్త్రీ కాదు. అట్లే, సాంగోపాంగ వేదాధ్యయనం చేసిన పురుషులను 'సరస్వతు'లనవచ్చు. అయితే స్త్రీ పురుష భేదం తెలియటానికి వారిని 'సరస్వతీపుత్రు'లనటం లోకాచారంగా వస్తున్నది.

వైదిక సంస్కృతిలోని చతురాశ్రమాలలో సంన్యాసం చివరి ఆశ్రమం. ఒక సంన్యాస సాంప్రదాయంలో ఆ ఆశ్రమ స్వీకారం చేసిన వారిపేరు మార్చి, ఆ పేరు చివర సరస్వతి అనే పదం జోడించటం మధ్యకాలంలో ఆచారంగా ఏర్పడింది. పూర్వం పూర్ణవిద్వాంసులైన వారే సంన్యాసాశ్రమ స్వీకారం చేసేవారు. అందరూకాదు. మిగిలినవారు వానప్రస్థాశ్రమం వరకు వచ్చి అక్కడనే ఆగిపోయేవారు. పూర్ణ విద్వాంసులను సరస్వతులనవచ్చు. ఇంతేగాక, సంన్యాసులు దేశసంచారం చేస్తూ వారి విద్యావిజ్ఞానాలను లోకమంతా ప్రవహింపచేస్తూ ఉండేవారు. అందువలన వారి విద్య గతివంతమయ్యేది. కనుక, వారు సార్థక నామధేయులయ్యేవారు. కాని, నేడు లోకంలో విద్యావంతులు కానివారుకూడ కొందరు సంన్యాసాశ్రమం స్వీకరించి పేరు చివర సరస్వతి యని తగిలించుకుంటున్నారు. ఇది అంతగా శోభించదు.

అధి దైవికార్థంలో వాక్ శక్తిని సరస్వతి అనవచ్చును. విద్య గతివంతం కావాలంటే - ప్రవహించాలంటే శుద్ధమైన సుసంస్కృతమైన వాక్ అవసరం. దానివల్లనే గురుశిష్య పరంపరగా విద్య నిరంతరంగా తరతరాలలో ప్రవహిస్తుంది. కనుకనే వేదాలలో శుద్ధమైన వాక్ శక్తిని సరస్వతిగా పేర్కొనటం, స్తుతించటం జరిగింది. విద్యనుగూడా సరస్వతిగా పేర్కొన్న సందర్భాలూ ఉన్నాయి.

పై మూడు రకాల సరస్వతులను మనమంతా స్తుతించవలసిందే, ప్రార్థించవలసిందే, ఉపాసించవలసిందే. స్తుతించటం వల్ల విద్యవల్ల కలిగే ప్రయోజనాలు అవగతమై మనకు సరస్వతిపైన (విద్యపైన) భక్తి, శ్రద్ధలు ఏర్పడతాయి. ప్రార్థించటం వలన, మనం నేర్చుకున్నది స్వల్పమేననీ, నేర్చుకోవలసింది చాలా

ఉన్నదనీ తెలిసి మనలోని అహంకారం శాంతిస్తుంది. ఉపాసించటం వల్ల అంటే - దైవాన్ని, గురువులను, విద్యను ఉపాసించుటవల్ల - వారి వద్ద విద్య నభ్యసించుటవల్ల మనకు సరస్వతి ప్రాప్తిస్తుంది. కనుకనే ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలలో ఈ 3, 4 రకాల సరస్వతులను గూర్చిన స్తుతి ఉంది. ముఖ్యంగా ఈ చిన్ని పుస్తకంలో సరస్వతీ ప్రార్థన గల కొన్ని సరళమైన వేద మంత్రాలను సేకరించి వాటికి పరమేశ్వరుని పరంగా అర్థం వ్రాయటం జరిగింది.

ఈ సరళమైన వేదమంత్రాలతో విద్యార్థులు నిత్యం పరమేశ్వరుని ప్రార్థన చేసుకుంటే తప్పక వారి బుద్ధి వికసిస్తుంది. ధారణాశక్తి - జ్ఞాపకశక్తి పెరుగుతుంది. విశాలమైన భావాలు కలుగుతాయి. దానితో వారు అన్ని రంగాలలోను ఉన్నతిని పొందుతారు. అయితే, ఆ ప్రార్థన అర్థభావనతో చేయవలసి ఉంటుంది. **"తత్ జపః తద్ అర్థ భావనమ్"** అని యోగ దర్శనంలో (1-28) పతంజలి మహర్షి చెప్పారు. అందుకొరకై ఆ మంత్రాలకు సరళమైన భాషలో సంక్షిప్తంగా అర్థం వ్రాయబడినది.

ఆయుర్వేదంలో మేధోవికాసానికి కొన్ని మూలికలు చెప్పబడ్డాయి. వాటిని లోపలకు సేవించవచ్చును. మరియు వాటిని అగ్నిహోత్రంలో ఆహుతులుగా కూడ యివ్వవచ్చు. మంత్రాల చివర 'స్వాహా'కారం పలుకుతూ ఆహుతులు ఇవ్వాలి. అనంతరం **"ఇదం సరస్వత్యై - ఇదం న మమ"** అనే మాటలు పలకాలి. ఈ ఆహుతిని భక్తి శ్రద్ధలతో సరస్వతి కొరకు అర్పిస్తున్నాననే భావం ఈ వాక్యాలలో ఉంది.

**మేధస్సును (బుద్ధిని) వికసింప చేసే కొన్ని మూలికలు :**

బ్రాహ్మీ (సరస్వతి ఆకు), శంఖపుష్పి, వస, జ్యోతిష్మతీ, అశ్వగంధా, జటామాంసీ, పుష్కరమూలం, మాలకంగినీ, సోంపు, అంజీరపండ్లు (ఎండినవి), అక్రోటు, బాదం, ఆవుపాలు (దేశీవి అయితే మంచివి), ఉసిరిక, కరక్కాయ, కుంకుమ పువ్వు, కొబ్బరి, జాజికాయ, జవ్వాది, జాపత్రి, తులసి, తుంగమస్తలు, శొంఠి మొ॥

**ఔషధములు :**

1) ఆయుర్వేదం - సరస్వతీ లేహ్యము, స్వర్ణ భస్మము, మేధోవటి మొ॥
2) హోమియో - Kali Phos 6x - 4 బిళ్ళలు, 2 పర్యాయములు;

Anacardium 200 - వారానికి ఒక మోతాదు(10 చిన్న మాత్రలు).

(పరీక్షల ముందు 3 నెలలు వాడిన చాలును)



# వేదాలను అందరూ చదువవచ్చు

**ఓం యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।**
**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ ॥**

యజుర్వేదం (26-2)

ఓ మానవులారా ! పరమేశ్వరుడనైన నేను ఈ కళ్యాణకరమగు వేదవాణిని మానవమాత్రులందరి కొరకు ఉపదేశించుచున్నాను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులకు ; వారి స్త్రీలకు, భృత్యులకు మరియు సదాచారపరులైన అంత్యజులకును ఉపదేశించుచున్నాను. అట్లే, మీరును అందరకు ఉపదేశించి ముందుతరాలవారికి అందించెదరు గాక !

I do hereby address this salutary speech for the benefit of Humanity (all men & women) for the Brahmanas, the Kshatriyas, the Sudras, the Vyshyas, the king'sfolk and the men of lowest position in society.



# చతుర్వేద
# సరస్వతీ సూక్తము

**(బుద్ధి వర్ధక వైదిక ప్రార్థన)**

**ఓం పావకా నః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ**
**యజ్ఞం వష్టు ధియావసుః ॥** **(1)**

ఋగ్వేదము (1-3-10)

హే వాగ్దేవీ! సరస్వతీ! మమ్ము పవిత్రపరచుము. నీవు సర్వ విద్యానిధివి. మమ్ము విద్యావంతులనుచేసి తద్వార మాకు పుష్కలమైన అన్నపానీయాదులు లభించునట్లు చేయుము. నీవు ఉత్తమ బుద్ధుల నిచ్చు జ్ఞానదేవతవు. మమ్ము సదా యజ్ఞాది పరోపకార కార్యములందు ప్రేరేపింపుము. మా యజ్ఞములను సఫలము చేయుము.

**ఓం చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్ ।**
**యజ్ఞం దధే సరస్వతీ ॥** **(2)**

ఋగ్వేదము (1-3-11)

హే సరస్వతీ ! నీవు మాకు మంచి నీతులనుపదేశిస్తూ మమ్ము సత్కార్యములందు ప్రేరేపింపుము. మా బుద్ధులను వికసింపజేస్తూ మమ్ము మేధావులను చేయుము. మేము నీ అనుగ్రహమును పొంది యజ్ఞమయ జీవితం గడుపుదుము గాక !

**ఓం మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా।**
**ధియో విశ్వా వి రాజతి ॥** **(3)**

ఋగ్వేదం (1-3-12)

హే వాణీసరస్వతీ ! మహా సముద్రం వలె నున్న శబ్దరాశిని మా కుపదేశింపుము. మే మా భాషతో విశ్వమానవుల బుద్ధులను చక్కగా ప్రకాశింప జేయగలుగునట్లు అనుగ్రహింపుము.

**ఓం అమ్బితమే నదీతమే దేవితమే సరస్వతి ।**
**అప్రశస్తా ఇవ స్మసి ప్రశస్తిమమ్బ నస్కృధి ॥** (4)

ఋగ్వేదము (2-41-16)

హే సరస్వతీ! నీవు అత్యంత గొప్ప ఉపదేశికవు. గొప్ప జ్ఞాన నిధివి. ఎన్నో నిగూఢ విద్యలు కలదానివి. ఓ మాతా! కరుణించి అప్రశస్తులమైన మమ్ము ప్రశస్తులను చేయుము. విద్యలేక మేము గుర్తింపును పొంద లేకున్నాము. మమ్ము విద్యావంతుల జేసి, విద్యా విజ్ఞాన రంగాలలో గుర్తింపును పొందునట్లు అనుగ్రహింపుము.

**ఓం త్వే విశ్వా సరస్వతి శ్రితాయూంషి దేవ్యామ్ ।**
**శున హోత్రేషు మత్స్వ ప్రజాం దేవి దిదిడ్ఢి నః ॥** (5)

ఋగ్వేదము (2-41-17)

అనేకానేక దివ్యగుణాలతో విరాజిల్లు ఓ సరస్వతీమాతా ! మా సమస్త ఆయువులు - జీవితములు నిన్నాశ్రయించి ఉన్నవి. యోగవిద్యానిపుణుల నాశ్రయించి ఉన్నతిని పొందునట్లు మాకును మా సంతానమునకును ఉపదేశింపుము.

**ఓం ఇమా బ్రహ్మ సరస్వతి జుషస్వ వాజినీవతి !**
**యా తే మన్మ గృత్సమదా ఋతావరి ప్రియా దేవేషు జుహ్వతి ॥** (6)

ఋగ్వేదము (2-41-18)

హే ఋతావరీ - సదా సత్యాచరణ యుక్తురాలా ! ఓ వాజినీవతీ - అనంత అన్నాది ఐశ్వర్యయుక్తురాలా ! సామాన్య విద్యలను, విశేష విద్యలను పొందగోరు వారందరికి నీవు ఉపదేశింతువు. నీవు విద్యాదాతవు. కనుక మమ్మును విద్యావంతులుగ జేయుము.

**ఓం ప్ర ణో దేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ ।**
**ధీనామవిత్ర్యవతు ॥** (7)

ఋగ్వేదము (6-61-4)

ఎన్నెన్నో దివ్యగుణాలతో విరాజిల్లు ఓ సరస్వతీ ! నీవు అన్నాది పదార్థాలను, జ్ఞానవిజ్ఞాలను కలిగిన దివ్యమాతవు. కరుణించి మా బుద్ధులను వికసింపజేయుము. కామ క్రోధాదుల బారి నుండి మా బుద్ధులను రక్షింపుము.

**ఓం యస్త్వా దేవి సరస్వత్యుపబ్రూతే ధనే హితే ।**
**ఇంద్రం న వృత్రతూర్యే॥** (8)

ఋగ్వేదము (6-61-5)

ఓ సరస్వతీ దేవీ ! మెరుపులు మేఘాలను భేదించి వర్షింప జేయునట్లు మా సమస్యలను భేదించి మాపై సత్యజ్ఞానమును వర్షింప జేయుము.

**ఓం త్వం దేవి సరస్వత్యవా వాజేషు వాజిని ।**
**రదా పూషేవ నః సనిమ్ ॥ (9)**

ఋగ్వేదము (6-61-6)

ఓ ప్రశస్త విజ్ఞాన నిధివైన దేవీ ! సరస్వతీ ! సత్యాసత్య వివేకములను కలిగించు మా బుద్ధులను ప్రేరేపింపుము. భూమాత అనేక పంటల నిచ్చి పోషించునట్లే నీవును మాకు అనేక రకముల జ్ఞానముల నిచ్చి పోషింపుము. మేము వాటితో అనేక రంగాలలో ఉన్నతిని పొందుదుము గాక !

**ఓం ఉత స్యా నః సరస్వతీ ఘోరా హిరణ్యవర్తనిః ।**
**వృత్రఘ్నీ వష్టి సుష్టుతిమ్ ॥ (10)**

ఋగ్వేదము (6-61-7)

హే దుష్ట శిక్షక శిష్ట రక్షక సరస్వతీ మాతా ! మెరుపు మేఘాలను భేదించునట్లు, మా కామక్రోధాది శత్రువులను సంహరించి మమ్ము కాపాడుము. మాకు సుఖశాంతులను, కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చుము.

**ఓం ఆపప్రుషీ పార్థివాన్యురు రజో అన్తరిక్షమ్ ।**
**సరస్వతీ నిదస్పాతు ॥ (11)**

ఋగ్వేదము (6-61-11)

ఓ సరస్వతీ మాతా ! నీవు పృథివీ అన్తరిక్షాలలో సర్వత్ర వ్యాపించి యున్న సర్వవ్యాపక సర్వేశ్వరివి. కరుణించి మమ్ము దుష్టుల బారిన - దుర్గుణముల బారిన పడకుండా కాపాడుము.

**ఓం దేవా యజ్ఞమతన్వత భేషజం భిషజాశ్వినా ।**
**వాచా సరస్వతీ భిషగిన్ద్రాయేన్ద్రియాణి దధతః ॥ (12)**

యజుర్వేదము (19-12) -

ఓ సరస్వతీ మాతా ! యజ్ఞ విద్వాంసులు మాచే వివిధ యజ్ఞములను చేయింతురు గాక ! ఆయుర్వేద విజ్ఞులైన అశ్వనీ దేవతలు (Physicians & Surgeons) మాకు చక్కటి చికిత్స చేయుదురు గాక ! వేద విద్వాంసులు వేద

సరస్వతిని వినిపించి మాకు పరమైశ్వర్యాలను, ఇంద్రియ శక్తులను ప్రాప్తింప చేయుదురు గాక !

**ఓం తనుపా భిషజా సుతేఽశ్వినోభా సరస్వతీ ।**
**మధ్వా రజాంసీన్ద్రియమిన్ద్రాయ పథిభిర్వహాన్ ॥ (13)**

యజుర్వేదము (20-56)

హే విద్యా సరస్వతీ ! నీ కృపవలన అశ్వినీ దేవతలు (Physicians & Surgeons) మా శారీరకారోగ్యాలను చక్కబరుతురు గాక ! నీ వేదవిద్య మా వాక్కును మధురము చేయును గాక ! మా ఐశ్వర్య మార్గములన్నియు సుగమములగును గాక !

**ఓం ఆదిత్యైర్నో భారతీ వష్టు యజ్ఞం సరస్వతీ సహ రుద్రైర్నోఽ ఆవీత్ ।**
**ఇడోపహూతా వసుభిః సజోషా యజ్ఞంనో దేవీరమృతేషు ధత్త ॥ (14)**

యజుర్వేదము (29-8)

ఓ సరస్వతీ మాతా ! నీ కృపవలన ఆదిత్య బ్రహ్మచారుల భారతీవాణి మా యజ్ఞాలను (పరోపకార కార్యాలను) ప్రకాశవంతము చేయును గాక! రుద్ర బ్రహ్మచారుల దివ్యోపదేశాలు మాకు మార్గదర్శకమగును గాక! స్తుతించదగిన వసుబ్రహ్మచారుల వాణి మాకు ఆనందదాయకమగును గాక ! ఈ త్రివిధ బ్రహ్మచారుల ఉపదేశాలతో మేము అమృతత్త్వమును పొందుదుము గాక !

(ఒక వేదం అధ్యయనం చేసిన వారిని వసుబ్రహ్మచారులనీ, రెండు వేదాలను ధారణ చేసిన వారిని రుద్రబ్రహ్మచారులనీ, నాలుగు వేదాలను చదివిన వారిని ఆదిత్య బ్రహ్మచారులనీ అంటారు)

**ఓం ఉత నః ప్రియా ప్రియాసు సప్తస్వసా సుజుష్టా ।**
**సరస్వతీ స్తోమ్యా భూత్ ॥ (15)**

సామవేదము (1461)

హే సరస్వతీ మాతా ! నీవు మాకు ప్రియమైన వారిలో అత్యంత ప్రియమైన దానవు. మేము మా పంచప్రాణాలతోను, మనో బుద్ధులతోను నిన్ను సేవించుచున్నాము. మాచే చక్కగా సేవింప బడినదానివై మమ్మీలోకమున సదా ప్రశంసా పాత్రులనుగా జేయుము.

**ఓం సరస్వతి వ్రతేషు తే దివ్యేషు దేవి ధామసు ।**
**జుషస్వ హవ్యమాహుతం ప్రజాం దేవి రరాస్వ నః ॥** (16)

అథర్వవేదము (7-68-1)

ఓ దివ్యగుణయుక్త సరస్వతీ ! వేద విజ్ఞాన ధాత్రీ ! నీ దివ్యవ్రతములలోనూ (నియమములలోను), ధారణా శక్తులలోను (సృష్టి కార్యాలలోను) మేము అర్పించు సత్కర్మలను స్వీకరించుము. ఓ దేవీ ! మాకు ఉత్తమ సంతానమును, ఉత్తమ అనుచరులను ప్రసాదింపుము.

(భావార్థము : మానవులు సృష్టి నియమాలను, ఈశ్వరీయ కర్మలను చక్కగా తెలుసుకొని, గుర్తించి వాటి కనుకూలంగా జీవించాలి. సృష్టికర్త ననుసరిస్తూ మనమునూ కొన్ని యజ్ఞాలు, సత్కార్యాలు చేసి పరమేశ్వరున కర్పించాలి.)

**ఓం ఇదం తే హవ్యం ఘృతవత్ సరస్వతీదం పితౄణాం హవిరాస్యం యత్‌**
**ఇమాని తే ఉదితా శంతమాని తేభిర్వయం మధుమన్తః స్యామ ॥**(17)

అథర్వవేదము (7-68-2)

హే సరస్వతీ మాతా ! వేదవిద్యాదాత్రీ ! ఏవైతే నీ యొక్క ప్రకాశయుక్త హవ్యములున్నవో - గ్రహణ యోగ్యమైన ఉత్తమ కర్మలున్నవో మరియు పితరుల వంటి విద్వాంసుల ముఖము నుండి వెలువడు విద్యలున్నవో, అవన్నీ మాకు అత్యంత శక్తినిచ్చు విద్యలు. కనుక, వాటిని పొంది ఉత్తమ జ్ఞానవంతులగునట్లు మమ్మనుగ్రహింపుము.

**ఓం శివా నః శంతమా భవ సుమృడీకా సరస్వతి ।**
**మా తే యుయోమ సంధృశః ॥** (18)

అథర్వవేదము (7-68-3)

ఓ సరస్వతీ ! పరమేశ్వరీ ! నీవు మా కొరకు అత్యంత కళ్యాణకారివీ, అత్యంత శాంతి దాతవీ మరియు అత్యంత సుఖమునిచ్చుదానివీ కమ్ము. మేము నీ యథార్థ స్వరూపమును తెలుసుకొని ఎప్పటికిని నీ నుండి వేరుకాకుందుము గాక !

**ఓం సరస్వతీం దేవయన్తో హవన్తే, సరస్వతీమధ్వరే తాయమానే ।**
**సరస్వతీం సుకృతో హవన్తే సరస్వతీ దాశుషే వార్యం దాత్ ॥** (19)

అథర్వవేదము (18-1-41)

ఓ వేదవిద్యా సరస్వతీ ! దివ్యగుణములు కోరు దేవతలు నిన్ను సాదరంగా ఆహ్వానింతురు. వివిధ యజ్ఞాలను విస్తృతపరచు యాజ్ఞికులు నిన్ను గౌరవింతురు.

గొప్ప గొప్ప మహత్కార్యములను చేయు కర్మయోగులు, విజ్ఞానవేత్తలు నీ సహాయము నపేక్షింతురు. అట్టి భక్తులందరికి నీవు శ్రేష్టమైన పదార్థముల నిచ్చుచుందువు. మాకును అట్టివి ప్రాసాదింపుము.

**ఓం సరస్వతీం పితరో హవన్తే దక్షిణా యజ్ఞమభినక్షమాణాః ।**
**ఆసద్యాస్మిన్ బర్హిషి మాదయధ్వమనమీవా ఇష ఆ ధేహ్యస్మే ॥ (20)**

అథర్వవేదము (18-1-42)

ఓ వేద సరస్వతీ ! విజ్ఞానవేత్తలైన పితరులు వారి యజ్ఞములు - మహత్కార్యములు సఫలమగుటకు నిన్ను ఆహ్వానింతురు. విద్వాంసులందరు ఐకమత్యముతో ఆ మహత్కార్యమును సాధింతురు. హే సరస్వతీ ! మాకును అట్టి ఉపద్రవ రహితమైన మంచి కోరికలను ప్రసాదింపుము. వాటిని పొందగల జ్ఞానవిజ్ఞానములనిచ్చి కాపాడుము.

**ఓం సరస్వతి యా సరథం యయాథోక్థైః స్వధాభిర్దేవి పితృభిర్మదన్తీ ।**
**సహస్రార్ఘమిడో అత్ర భాగం రాయస్పోషం యజమానాయ ధేహి ॥(21)**

అథర్వవేదము (18-1-43)

హే దివ్యగుణయుక్త వేద సరస్వతీ ! నీవు నీ దివ్యగుణాలతో సదా పితరులను (విజ్ఞానవేత్తలను) తృప్తి పరతువు. ఎవ రే విజ్ఞానము నాశింతురో వారి కా యా విజ్ఞానముల నొసంగుదువు. జిజ్ఞాసువుల ప్రశ్నలకు సమాధానమిత్తువు. కావున ఓ దేవీ! సహస్ర ప్రయోజనములను చేకూర్చు నీ వివిధ ధనముల నిచ్చి ఈ యజమానిని యజ్ఞకర్తను- సత్కర్మశీలుని తృప్తిపరచుము. నీ కివే మా సహస్ర ప్రణామములు.

(ఈ మంత్రాలతో అగ్నిహోత్రంలో ఆహుతులివ్వవచ్చును. అప్పుడు మంత్రముల చివర 'స్వాహా' కారము పలుకుతూ ఆహుతినిచ్చి, అనంతరం "ఇదం సరస్వత్యై - ఇదం న మమ" అను మాటలు చెప్పుకోవలెను. తదుపరి శ్రద్ధనుబట్టి సమయమునుబట్టి గాయత్రీ మంత్రంతో కొన్ని ఆహుతులిచ్చుట మంచిది. ఏలనన బుద్ధివికాసంకొరకు ప్రార్థించే మంత్రాలన్నిటలో గాయత్రీమంత్రం శ్రేష్ఠమైనదని మన మహర్షుల అభిప్రాయం) .

గాయత్రీ మంత్రము చివరి పుటలో చూడండి.

# సృష్టికర్త సందేశం

**'శం సరస్వతీ సహ ధీభిరస్తు'** (ఋ.7-35-11)

విద్యధీయుక్తము, ధర్మవంతమునై సుఖశాంతుల నిచ్చును గాక !

'సరస్వతి' అంటే విద్య. ఏ విద్య అయినా అది ధీయుక్తమైనప్పుడే విశేషలాభం కలుగుతుంది. ధీయుక్తమంటే - విశేష బుద్ధితో ఆ విద్యలను గురించి లోతుగా ఆలోచించటం. అలాచేస్తేనే నూతనావిష్కారాలు ఆవిష్కరించగలుగుతారు.. క్రొత్తవి కనిపెట్ట గలుగుతారు. అది ఒక కళగా మారి క్రొత్త క్రొత్త యంత్రాలను, నిర్మాణాలను, సుఖసాధనాలను నిర్మించగలుగుతారు. ఆ క్రొత్తవి వారికే గాక ముందుతరాలకును సుఖాన్ని కలిగిస్తాయి. కనుక విద్యార్థులు విద్యలను అధ్యయనం చెయ్యటంతోబాటు వాటిని గురించి మననం చెయ్యాలి.

ఇంతేగాక, విద్య వివేకాన్ని కలిగించాలి. సత్యాన్ని వేరుగా అసత్యాన్ని వేరుగా చూపగలగాలి. సత్యాన్ని, ధర్మాన్ని అనుసరింపచేసి ధర్మవంతులను చెయ్యగలగాలి. కర్తవ్య నిష్ఠులను చెయ్యగలగాలి. అప్పుడే మనకు విద్యవల్ల పూర్ణ ప్రయోజనం కలుగుతుంది. లేకుంటే ఆ విద్యలు నామమాత్ర డిగ్రీలుగానే ఉండిపోతాయి. ఒకవేళ ఆ విద్యలను అధర్మకర్యాలకు వినియోగిస్తే అశాంతి, ఆందోళనలు తప్పవు. అవి కష్టాలకు కడగండ్లకు గురిచేస్తాయి. సృష్టికర్త మరొక ఉపదేశమేమంటే

**"విద్యాం చా విద్యాం చ యస్తద్ వేదో భయం సహ।**
**అవిద్యయా మృత్యు తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే॥** -యజుర్వేదం (40-14)

ఓ మానవులారా !, భౌతిక విద్యలతోబాటు ఆధ్యాత్మిక విద్యను కూడా జతగానే అభ్యసించండి. భౌతిక విద్యలతో కష్టాలను తరించి ఆధ్యాత్మిక విద్యతో అమరత్వాన్ని సాధించండి." కనుక మనం అట్లే చేద్దాం. అస్తు

॥ సర్వేజనా సుఖినోభవంతు ॥

ఓం ఇతి శమ్

# గాయత్రీ మహా మంత్రము

**ఓం భూర్భువః స్వః ।**

**త త్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి ।**

**ధియో యో నః ప్రచోదయాత్ ॥**

(ఋగ్. 3-62-10; యజు. 3-35, 22-9, 30-2, 36-3;
సామ. 2462; అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములు)

**భావార్థం :** హే సర్వసంరక్షక ! సచ్చిదానంద స్వరూప ! జగదుత్పాదక దేవ ! నీ దివ్యగుణ యుక్తము, వరేణ్యమునగు విశుద్ధ విజ్ఞానస్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక ! నీవు మా బుద్ధులను వికసింపజేసి సత్కర్మలయందు ప్రేరేపింతువు గాక ! మే మా సద్బుద్ధుల సహాయమున సద్వ్రతముల నాచరించి అభ్యుదయ నిః శ్రేయసముల నందుదుము గాక !

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (20-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (30-00), మానవ ధర్మము (20-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), దైనిక అగ్నిహోత్రవిధి (4-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8-00), వైదిక వివాహ వైశిష్ట్యము (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00) మహర్షి మనువుపై విరోధమెందుకు? (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), ద గ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), బ్రహ్మచర్య విజ్ఞానము (15-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), చతుర్వేద సరస్వతీ సూక్తము (10-00), పెండ్లినాటి ప్రమాణాలు (40-00), అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం (60-00), ఈశావాస్య మిదం సర్వమ్ (35-00), శాంతి సూక్తం (వైజ్ఞానిక వివరణతో) - (ముద్రణలో)

(తపాలా ఖర్చులు అదనము)

Gayatri Series : 52

**SARASWATEE SUUKTAM** **Rs. 10/-**

---




దేవత : వేదమాతా ఛందస్సు : అతిజగతీ

స్తుతా మయా వరదా వేదమాతా
ప్రచోదయతాం పావమానీ ద్విజానామ్ ।
ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం
ద్రవిణం బ్రహ్మవర్చసమ్ ।
మహ్యం దత్త్వా వ్రజత బ్రహ్మలోకమ్ ॥ అథర్వవేదము (19-71-1)

ద్విజులను (విద్యాగర్భంనుండి రెండవసారి జన్మను బొందిన విద్యావంతులను) పవిత్రపరచు వేదమాత నాచే కీర్తింపబడుచున్నది. ఆ వేదమాత నాకు ఈ లోకమున దీర్ఘాయువును, బలమైన ప్రాణశక్తిని, సుసంతానమును (అనుచరులను), గో అశ్వాది పశుసంపదలను, కీర్తిని, ధనమును, బ్రహ్మజ్ఞాన ప్రకాశమును ఒసగి తదుపరి జీవాత్మనైన నన్ను బ్రహ్మలోకమునకు (ముక్తిధామమునకు) చేర్చును గాక !

---

***Published by :***

*Gayatri Ashram Trust,*

**Arya Samaj - Vyasnagar, Medibavi, Warasiguda,**
**Secunderabad - 500 061. Cell : 9290604641.**